# శ్రీ కంచివరదరాజ

# శతకము

అల్లూరి రాజేశ్వరకవి ప్రణీతము

కొండపల్లి (స్టేషన్) వాస్తవ్యులగు
కపిలవాయి పున్నయ్య గుప్తగారి
ద్రవ్య సహాయమున

బెజవాడ, చిత్తరంజన్ ప్రెస్‌లో
ముద్రితము.

1000 ప్రతులు.

కాపీరైటు రిజష్టర్డు] 1933. [వెల రు. 0—2—0.

# పీఠిక.

ఆర్యులారా!

ఇదివరలో నాచే రచింపఁబడిన పొత్తములలో గీతాగేయ మనునది త్రిపురనేని వీరరాఘవయ్యచౌదరిగారి సాహాయ్యమునను, వేదాద్రి నృసింహశతకము నాస్వంత వ్యయమువల్లను ముద్రింపబడి యున్నవి. యింకా చాలా పుస్తకములు ప్రస్తుత స్థితిలో నాచే రచింపబడినను ముద్రిణ కావలసియున్నవి. అట్టి స్థితిలో సదరు పేర్కొనబడిన పున్నయ్య గుప్తగారు తాము ధనవ్యయమును భరించి శ్రీవరదరాజస్వామియెడ కనపరచిన భక్తికి నేనెంతయు సంతసించి వారిని ఆచంద్రార్కము వర్ధిల్లజేయు గాతయని భగవంతుని ప్రార్థించుచున్నాడను.

పరిటాల,
3—5—1933.

ఇట్లు,
అల్లూరి రాజేశ్వర కవి.

# శ్రీ కంచి వరదరాజ శతకము.



శ్రీశుఁ గొలిచి కావ్యసిద్ధికై పలుకుల
వెలది దలచి పొగడి విఘ్నరాజు
నమలచరిత శతక మారంభ మొనరింతు
భానుకోటి తేజ వరదరాజ॥

2 లేత దనుచు దేని లెక్కింపకుండిన
లేతపోయి ప్రాణఘాతకమగు
శాంతకరుని కోపమలాంతపంబున బోలి ॥భా

3 నిముసమైన మనసు నిలుపనేరక బ్రహ్మ
విద్య సాధ్యమగున వేగిరంబడ
కోటి జన్మలెత్తి గూరుచో యరుదుగా ॥భా॥

4 కొంచె మేని సుకృత మెంచక మది మైల
టంచు మిడుక ముక్తి యలవడునొకో
పాంచభౌతికమున కెంచ బాట్లివి కదా ॥భా॥

5 పాపపుణ్యములకు బట్టణము న్నిమా
నసమునందె యున్నది సకలంబు
గుడిసె గొప్ప మేడగునె మది భావింప ॥భా॥

6 ఒకటి క్రొత్త లేను సకల మీ జీవుండు
ననుభవించి విడచె నట్టులయ్యు
యెలమి మరల గ్రొత్త యేజన్మ కాజన్మ ॥భా॥

7 అగ్రికులజ ధర్మ మధ్యయనంబుగా
మాకు వలయునందురి మాదుగు లిల
అధ్యయనము మోక్ష సాధ్య కారణమొకో ॥భా॥

8 జన్మయే తలంప సకలార్థులకు గొంప
కష్ట మేమి యిక సుఖమన నేమి
పారుడైన నేమి శ్వపచుడుగా నేమి ॥భా॥

9 యెల్ల వేదములను వల్లించినను ముక్తు
డగునె జ్ఞానికాక యట్టులగుట
వేదపఠన మాల మాదుగులకు నేల ॥భా॥

10 పూర్వ జన్మ పుణ్యమున జ్ఞాని కావలె
వామలూరు భవుని సామెత గన
గాకమాల వేద గానముచేనొనె ॥భా॥

11 ధర్మకతన నున్న తస్పితి చనుకాని
వృద్ధిగ నెదరె పృథివిని విధవల
పరిణయముల మాలపారుని కలియిక ॥భా॥

12 అన్న దమ్ముల కిల నున్న యైక్యము విప్రు
డేకపఙ్క్తి హీను నేలజేర్చు
కూడు మెసగకున్న కూడిక పొసగదా ॥భా॥

13 స్వకులధర్మముల విసర్జించి పారులు
భ్రష్టులగుచునుండ బ్రాహ్మణ విధు
లపయి కోర్కె హీనులకు నేటి పాపమో ॥భా॥

14 బొమ్మ యగు నె మూలపురుషు డేటికి గుడి
బొమ్మగూర్చి వెలికి బొమ్మటంచు
బోనటంచు మాల! భూసురుడుఁ బోర ॥భా॥

15 పెక్కు విధములుండె యొక్కటే తెరగున్న
మానవుడు తరింప గాన వారి
వారి ధర్మవిడక వర్తిల్ల మేలయా ॥భా॥

16 ఇచ్చ కలిమి జేయువచ్చు నరుడు పాప
మిచ్చ లేమి నపుడు నచ్చటచటి
ధర్మవాదముల హితంబుల గరపెడు ॥భా॥

17 సాగకుంట దాను సాధువై చూపడు
సంతమాత్ర నమ్మనగు నె కుటిలు
సమయమైన తెన విషంబు గ్రక్కక యున్న ॥భా॥

18 పాపపుణ్యమనక బ్రాణ ముడ్వగఁ జాలు
వ్యక్తులుండు గూఢ వర్తనమున
గాన మేలు సుమ్ము జ్ఞానివై నడచిన ॥భా॥

19 తననుఁబట్టి జగమటనిన తప్పది! తాను
పరుల సేమ మరయు వాడునైన
తనను జంపు దొంగ తన ధనమును గోరి ॥భా॥

20 ఇచ్చకముల బలుకు నెంతె మచ్చికజూపు
గుత్సితుండు నమ్మ గూడదన్న
నమ్మ వీలు వచ్చినట్ల దిగమ్రింగడా ॥భా॥

21 వీలు లేమి సాధువృత్తి బూనిన వాని
సమ్మనగు నె మంతెనమ్మున వాని
పుట్టు గుణము బోనె కట్టెల బెట్టిన ॥భా॥

22 ధనికు గనిన నున్నదని చింత తన బీద
తనము గూర్చి చింత తనకు నోరుని
ధనముగూర ఘోరతర పాపచింతన ॥భా॥

23 మానవ ప్రయత్నమైన గూరు నె యదృ
ష్టమునగాక ధనము కుమతు లేల
దురితములకు లొంగుదురు ధన కాంక్షచే ॥భా॥

24 తల దరిద్ర దేవత నటింపుచుండగా
దుష్కృతముల నొకరి దోచికొనిన
వ్రాతపోనె గోచిపాతయె గతిగాక ॥భా॥

25 జనక ధనము వారసత్వపు తన హక్కు
గాని పరుల ధనము పైననేల
కాంక్ష మొరునిసుతుడగా బుట్టెనే తాను ॥భా॥

26 గంజి ద్రావి బ్రతుకు కాలము బుచ్చుటే
ఘనమటంచు మానఘనుడు దలచు
తుచ్ఛ సౌఖ్య కాంక్షతో డగడించునే ॥భా॥

27 వెంకటాద్రి మీఁదు కైంకర్యమును జేసి
నట్టి భక్తుఁడతని యన్వయుండ
కొ్రత్తగాను దాసకోటిలో వాఁడనే ॥భా॥

28 తండ్రి వైతి వీవు తల్లి పెరుందేవి
తల్లి దండ్రి బాల్య దశ గతింప
నున్న దంతియె స్థితి విన్నవించినదంతె ॥భా॥

29 కష్టపెట్టకు నను కరుణింపు దాసుని
కష్ట సుఖము నీది కాదె కాన
కష్ట సౌఖ్యములకు కర్తవు నీ యిచ్ఛ ॥భా॥

30 ఇహ పరముల సౌఖ్య మిమ్ము యీఁకుండిన
నింక నెటుల దప్పు వెంకటాద్రి
పైన నుండిన యభిమానము చేనైన ॥భా॥

31 వెంకటాద్రి యుద్భవించిన కులమందు
నుద్భవించకుంటి నో కొ్ర... వెంక
టాద్రి కైతి నాకు నష్టైల గాకుందు ॥భా॥

32 వెంకటాద్రి పాద పంకేరుహామె నొక
గాఁగ దాటి పాప సాగరంబు
అద్వయ! కనుగొందు నీ ద్వీపమున నిన్ను ॥భా

33 నమ్ముకొనిన గొలది నా గతి కడగండ్లు
గాని సౌఖ్యమన్న గానరాదు
నమ్ముమనని కెట్లు నమ్ముటో తెలియదు ॥భా॥

34 నమ్మకొన నిదర్శనమునకు గాసింత
ఫలము జూప నేమి బాధ నీకు
నమ్మకంబు నా మనంబున దృఢపడు ॥భా॥

35 ప్రస్తుత సుకృతములు ఫలమెప్పుడో యన
నెవ్వడోపు మర్త్యుడివ్వ వేడు
యిచ్చు దాతను జేరి యెప్పటి దప్పునే ॥భా॥

36 లోకదాత నీ విలోకన కావలె
నాకు దొడ్డ కలిమి చేకురవలె
గాక మర్త్యుడివ్వగా సమర్థుండొకో ॥భా॥

37 ఉంటి వనుకొనుటకు గంటికి దోపవు
లేవనుకొన సృష్టి యే విధమయె
యుంట నుండకుంట రెంట నిశ్చయ మెద్ది ॥భా॥

38 తావకీయ రూప దర్శనమన్న వే
రే విధంబు నీ శరీర మొండు
తోలు గన్నులు గన దోచెడు నేముందు ॥భా॥

39 జ్ఞానియైన వాని కానంద మొనగూరు
నంతె కాని కనుల కట్టెదురుగ
వచ్చి నిలచు నద్ది ప్రత్యక్ష రూపమై ॥భా॥

40 నిర్వికారుడ వగు నిన్ను సాకారిగా
జూడనగునె యటుల జూచితిమని
తెలుపువార లది మతిభ్రమ యే కాక ॥భా॥

41 జాలిగుండెవాని సరసఁ జేరియు బ్రీతి
మాల వినును గరిని డేల వినును
నీల భూమి జొచ్చు శిల జొరవచ్చునే ॥భా॥

42 పాలగనులమూసి గోప్రిలు బిడాలము
తన నెరుంగరనుచు దలచు బాపి
తన యకృత్య మెరుగ దరముకాదని యెంచు ॥భా॥

43 భక్తుడాన నేర్చు భవదీయనాను సు
ధారసంబు రిక్త తరమె తలప
తేటిమాదిరి బువు దేనె తావ్రివు నెకప్ప ॥భా॥

44 విలవిల యన బట్టి పీకుక దినుక దా
ప్రాణి బ్రాణి సృజన పరచి తేల
జీవహింస యే విశేషమా? నీకడ ॥భా॥

45 ఉన్నవానికిడెద వన్ని విధంబుల
లేనివాని నోటిలోన దువ్వ
నీకు పక్షపాతమే కదా శివశివా ॥భా॥

46 ఉర్వి వాసనల చతుర్విధ పురుషార్థ
మంచు ననుభవించ నెంచు నరుడు
కంప్లుబోయి వంగి కట్ట చేగొనియైన ॥భా॥

47 వారివారి కర్మ ఫలితమో కాక త్వ
దీయ ఘోరకృత్యమో యెరుంగ
నవని జరుగుచుండు నన్యాయములు మెండు ॥భా॥

48 కష్టసమయమందు కాదు దేవుండైన
జుట్టమైన గలిమి జూచివచ్చి
పొట్టపగుల మెక్కి బోదురంతియు కదా ॥భా॥

49 నమ్మగూడ దెపుడు నరులు స్వార్థపరులు
యవసరంబు దీరు నంతవరకు
ప్రేమ జూపి పిదప మోమైన జూపరు ॥భా॥

50 ఒసరి వద్దనుండి యర్జింప దగినది
తెలివి భాగవతుల చెలిమి లేక
నెట్టుల సమకూరు నీశ్వర జ్ఞానము ॥భా॥

51 నాయభాగ్యగరిమి నా దురదృష్టము
కాని నీకు చేతగాని దేది
సుర మహీజము తమ పెరటి చెట్టేకదు ॥భా॥

52 కొంతకాలము వరకుగా మరపించెదు
నల్లమందు మగత కల్లు మగత
మరుపు సతముగూర్చు మాయదైన మగత ॥భా॥

53 అన్నతమ్ములంబలె నందరి మగవారి
నక్క చెల్లెలింబలె నాడువారి
జూచు బుద్ధిగూరుచుము పదివేలది ॥భా॥

54 అన్ని జంతువుల మహాత్మ! నీ మయమని
తలచు చిత్తవృత్తి ద్వంద్వములను
సైచు బుద్ధివే ప్రసాదించు పదివేలు ॥భా॥

55 నేత్రపర్వముగ సుపుత్రపౌత్రప్రపౌ
త్రులు చెలంగ వారితోడ గుడుచు
భాగ్య మొసఁగు మదియె పదివేలుగా నెంతు ॥భా॥

56 ఎచటనైన మరియు నేవేళ యందైన
భాగవతుల చెలిమి వలన బ్రతుకు
గడుపు వరము నివ్వగా వేడికొనియెద ॥భా॥

57 పరసతీవిరక్తి భార్యానురక్తియు
ష్మత్పదాంబుజాత సక్తి నీదు
భక్తి దాన నాకు ముక్తి నొసంగవే ॥భా॥

58 భూమి వర్షమునకు బుట్టి తృణాంకుర
మపుడె పూసికాసి యందమిచ్చి
మాయమగును జూడ మా బ్రతుకంతియే ॥భా॥

59 చిటికలోన స్వల్పజీవుల నెన్నిటో
జూపియు మరుగుపరచు బుతు మహిమ
అందమనిన సృష్టి కప్పటికప్పుడే ॥భా॥

60 స్థిరముగాని యిట్టి సృష్టి వైచిత్ర్యము
లకు భ్రమింప జేసి యొక విధముగు
చింతముంచి తకట జీవుని తద్దృష్టి ॥భా॥

61 గూటదాచిపెట్టికొను విత్తమా లేదు
మాటుబడునటన్న మాట నిజము
నాటి సుఖము మదికి నాటిన వగ పేల ॥భా॥

62 ఎచటినుండి యిచటి కేతెంచునో పుట్టు
నిచటినుండి యెచటి కేగునో చను
అన్ని ప్రాణుల కసలాటపట్టేదయా ॥భా॥

63 దేశ దేశముల బ్రతిష్ఠ విద్వాంసున
కర్థవంతునకు గృహాంబునంద
విద్య గలిమి నేవిధంబున బోలెదు ॥భా॥

64 మూర్ఖుడలరు విత్తముం జూచి ప్రాజ్ఞుడు
విద్య నలరు డబ్బు వెచ్చబడిన
నూడు ధన ఘనంబు నుర్వి స్థిరంబు విద్య ॥భా॥

65 డొక్క శుద్ధి లేక మొక్కుచు బూర్వార్జి
తమును మనుదురేల ధన మదమున
వీసమైన సిగ్గు విద్వాంసు గనలేక ॥భా॥

66 మంచిదో చెడుదియొ మార్గ మొక్కటి కాదు
లోక మానవుల కనేక గతులు
చేరి నడకవారి కే మంచి దనిపించు ।భా॥

67 తప్పుదారిబట్టు దగదన వినడు చి
త్తమున దప్పటంచు దలపబోడు
చెప్పువారి నెదరి చెడతిట్టు మూర్ఖుడు ॥భా॥

68 ఒకని తప్పుచూచి యొకడు గాడందురు
హితము జెప్పుచుందురీ యు నెదరు
తోప దొకరికి తమ లోపలి లొటలొట ॥భా॥

69 పాల్గొను స్థిరబరుప బ్రతివాడు శుద్ధయ
బద్ధమైన సరియె పదుగురనిన
నిజముగూర్చి యెదురనేరదు పదుగుర ॥భా॥

70 దానమనిన నొప్పిదముకాదు దానికై
కరువు నెపము ఘోరకాంత యనిన
దాసులయ్యు బూదిబూసుక బోదురు ॥భా॥

71 కరువుచేత డబ్బు కటువైన బోగము
ముండలకడ కల్లు కుండలకడ
నాటపట్టు తప్ప దక్షయలక్ష్మికి ॥భా॥

72 ప్రాణ మొకటి కాదో పశువుల నరులకై
తన్య మొకటి కాదొ తప్పగునట
నరుని జంప బశువు నరుకుట నొప్పట ॥భా॥

73 సర్వభూత దయ ప్రశస్తము నరునకు
జాతి ప్రేమ యితర జంతువులకు
పశువు నిర్దయగను వాడొక మర్త్యుడా ॥భా॥

74 నోరులేని పశువు నొప్పింప మనుజులై
తప్పు నెట్లు మారి తలలబట్టి
యీడ్చుదొక్కొ యూరినూడ్చుక బోదొకో ॥భా॥

75 గొప్ప సుఖమదేదొ కుడిచెదనని చేయు
గాని తప్పపోదు కర్మఫలము
సుఖము గోల్పడి మనుజుడు బెనువగగుందు ॥భా॥

76 జీవహింస మాన్ప దేవుని తరమౌనె
ఫలలభక్షణ మలవాటుబడియె
మానవులకు మృగసమాజము పోలిక ॥భా॥

77 గుడువలేని వానినడుగ సాయము ధర్మ
కార్యమునకు నర్థి కఠినమ్ములను
చేతగాని వాని కూఁతయే ఘనమయా ॥భా॥

78 ఒకని కొకటి యిష్ట మొకనికి వేరొండు
నందరకు నదియదియన్ని యిష్ట
మొకటయిష్టమైన దున్నె పదార్థముల ॥భా॥

79 ఔషధము లనేకమైనవి వ్యాధికు
దుర్చ వైద్యుఁడు దొరకడయ్యో
నీవు పూనుకొనుము నెమ్మదించును రుజ ॥భా॥

80 కర్మఫలము గుడుప కఠినము బూనితి
కాని దయదలంప కానిదెద్ది
అమృత మొసగి యాయురారోగ్య మివ్వవా ॥భా॥

81 ముందు బాపకృత్యముల జోలిబోసని
యానగొని యిదివరలోని దొసగు
లన్ని సైచు కామి యక్కటా నేనోప ॥భా॥

82 జ్ఞానముఁ గడింప మానవజన్మ నొ
సంగినాఁడ వది పొసంగలేదు
సేకరించుదాక సాకుము నాతండ్రి ॥భా॥

83 జ్ఞానముఁ గడింప మానవదేహము
సంగినాఁడ విధి రుజాయుతంబు
జ్ఞానమేమొ కాని మేని నవతయాయె ॥భా॥

84 మానవుండననగ నజ్ఞానమా లేదయె
పశువు ననగ నాల్గు పదము లేవి
మానవ పశువన సమంజసముఁ దోఁచు ॥భా॥

85 ఒక్క నీదు కరుణయున్న జాలది నాకు
నెక్క నేను వేల్పు లెల్ల యేను
గస్మదీయ వైద్యు లశ్వినీ దేవతల్ ॥భా॥

86 వేయు మొత్తుకొనిన వినబడ దిడవు కి
రావలంబ మార యదయుడవగు
బండవౌట బోలు బండగా బూజింతు) ॥భా॥

87 అర్థివేడ దన గృతార్థు జేయక బెడ
చెవిని బెట్టునట్టి చెనటిబోలి
తౌర! మూర్ఖ నరుడవా! పరాత్పరుడవా! ॥భా॥

88 లెక్క లేసి చేతు లెక్కడ బోయెనో
నాలుగైన లేవె నా తలపయి
నుంప చిట్టచివర కొక్కైనను లేదె ॥భా॥

89 విద్య గలుగువాడు విను సంతసించును
విద్య లేనివాడు వినడు వినిన
దోస మెంచెడు బరిహాస మొనర్చెడు ॥భా॥

90 నీ స్వతంత్రమనుచు నిక్కదంతియు కాని
నీ స్వతంత్రమందు నిలచియున్నె
దేశములను లచ్చి తిరిగెడు చూడుపో ॥భా॥

91 దాని తొంటి దుష్కృతి ఫలమం చెంచకే
కరిని గావగ సమకట్టి తేల
నాయెడ నె నిదర్శనము బోలు ఫలితము ॥భా॥

92 నన్ను గావురమ్ము నా వినకుందువు
కరిని గావనై తె పరగినావు
దాని సేవ నీ కృతార్థత కాబోలు ॥భా॥

93 కష్టమయ్యె నిన్ను గదియ భక్తాళికి
నన్ను గదియ నంతకన్న నీకు
మిన్ననై తినే నె మీాక గమ్యుండనై ॥ ॥భా॥

94 నమ్మికన్న నమ్మినట్ల ఫలముండెడు
నాకు రూపరహితు నమ్మనగునె
యట్టి నమ్మకమున బుట్టి మునుంగదే ॥భా॥

95 నాస్తికులను వారె నైజమెరింగిరి
గాక వేడగా నొకానొకనిని
పేరులేనివాని గూరునే ఫలసిద్ధి ॥భా॥

96 కనులజూడ నీ జగన్మోహనాకార
మిట్టి జన్మనోచి పుట్టినానొ
కాక ముందు పుట్టగావలెనో చెప్పు ॥భా॥

97 పాండితీపటిమ యపారము గల్గిన
తెచ్చి పెట్టుకొనిన తీరుగాక
పద్యమల్ల నేరివశ మేరి సొమ్మయా ॥భా॥

98 దినదిన క్రమమున దీర్ఘ కాలమున బ్రి
యాస సాధకముల నలవడియెడు
గబ్బమనిన నేరి యబ్బ సొమ్మగుగాక ॥భా॥

99 గొట్టునుడుల బెద్ద గుండులో యనగ దొ
ర్లింపవచ్చు భావమింపుగూర
యింత పద్యమందు నిముడింప సాధ్యమే ॥భా॥

100 నిమురబోయి మేలొ్కనిన యట్టులేయుండు
చావుబుట్టుకలన జ్ఞానికరయ
మరణభీతి లేశమాత్రముండదు కదా ॥భా॥

101 ఆగతంబు దెలియ దనుభవింపక మున్న
జిత్రమయ్యెడు గత జీవితంబు
ముందు నెట్టి చిత్రములగన వలయునో ॥భా॥

102 దేని కేది కతము తెలియ దేనాటికి
నేది యెటులొ యటులనే జరిగెడు
చెలగి కర్మమయము సృష్టి రహస్యము ॥భా॥

103 కష్ట సుఖము గొంత కాలము బుచ్చెన
టన్న మాట లేదు స్వల్ప జీవి
తముల బుట్టనేల ధరమశకాదులు ॥భా॥

104 దంభమున భ్రమింతుర్ దంభము నటియింతుర్
దంభ మందరకు బ్రధానమయ్యె
దంభహీను జీవితము జీవితంబౌకో ॥భా॥

105 అంకితంబు నిడితి నాంగీర సాఖ్య వ
త్సరమునందు విజయ దశమి దీని
నందుకొనియు నిలుపు మాకల్పముందాక ॥భా॥

106 అప్పగింప శతకమల్లి యల్లూరి రా
జేశ్వర కవి దీని శాశ్వతముగ
నిలుపు మంకితంబు నీకిడు గడు బ్రీతి ॥భా॥

సంపూర్ణము.

చిత్తరంజన్ ముద్రాక్షరశాల, బెజవాడ.

104 దంభమున భ్రమింతురు దంభము నటియింతురు
దంభ మందరకు బ్రధానమయ్యె
దంభహీను జీవితము జీవితంబౌకో ॥భా॥

105 అంకితంబు నిడితి నాంగీర సాఖ్య వ
త్సరమునందు విజయ దశమి దీని
నందుకొనియు నిలుపు మాకల్పముందాక ॥భా॥

106 అప్పగింప శతకమల్లి యల్లూరి రా
జేశ్వర కవి దీని శాశ్వతముగ
నిలుపు మంకితంబు నీకిడు గడు బ్రీతి ॥భా॥

సంపూర్ణము.

చిత్తరంజన్ ముద్రాక్షరశాల, బెజవాడ.

104 దంభమున భ్రమింతురు దంభము నటియింతురు
దంభ మందరకు బ్రధానమయ్యె
దంభహీను జీవితము జీవితంబౌకో ॥భా॥

105 అంకితంబు నిడితి నాంగీర సాఖ్య వ
త్సరమునందు విజయదశమి దీని
నందుకొనియు నిలుపు మాకల్పముందాక ॥భా॥

106 అప్పగింప శతకమల్లి యల్లూరి రా
జేశ్వర కవి దీని శాశ్వతముగ
నిలుపు మంకితంబు నీకిడు గడు బ్రీతి ॥భా॥

సంపూర్ణము.

చిత్తరంజన్ ముద్రాక్షరశాల, బెజవాడ.

104 దంభమున భ్రమింతురు దంభము నటియింతురు
దంభ మందరకు బ్రధానమయ్యె
దంభహీను జీవితము జీవితంబొకో ॥భా॥

105 అంకితంబు నిడితి నాంగీర సాఖ్య వ
త్సరమునందు విజయ దశమి దీని
నందుకొనియు నిలువు మాకల్పముండాక ॥భా॥

106 అప్పగింప శతకమల్లి యల్లూరి రా
జేశ్వర కవి దీని శాశ్వతముగ
నిలువు మంకితంబు నీకిడు గడు బ్రీతి ॥భా॥

సంపూర్ణము.

చిత్తరంజన్ ముద్రాక్షర శాల, బెజవాడ.

